౧౪౧ సాయరు చావిడి = కస్టంహావుసు; ఎగుమతి దిగుమతి సరకులపైన సుంకములు వసూలు చేసే కచ్చేరి.

౧౪౧ చంగావివేసిన మంచిరేశు= రేశు,అనగాఅంచుకమ్ములు లేనివస్త్రము;దుప్పటిలో సగము;కుంఫిణీ వారి కాలంలోప్రసిద్ధికెక్కిన వస్త్రవిశేషము. A sheet of cloth called Dangari, A Salempoor - (బ్రౌన్య)

౧౪౪ అమింజీ = (అరవము) అమంజి; వెట్టి చాకిరి

౧౫౨ సల్తన = దర్జా, ఉద్యోగ హోదాకు తగిన గౌరవము

౧౫౪ నకీబులు = దూతలు; బట్టులు, చాటించువాండ్రు.

,, చోపుదార్లు= వేత్రధరులు; వెండి బెత్తములవారు.

౧౫౩ బావమరది వొప్పారితో = బావమరది వరసతో (ఇది అరవములో ఒప్పారి అనేమాట నుండి తెలుగులోకి వచ్చినది. - బ్రౌన్య - మిశ్ర)

౧౬౫ వినహా = వినా

౧౬౮ పదవాక్య ప్రామాణ్యము = చేసిన వాగ్దానము చెల్లిస్తారనే నమ్మకము; చెప్పే మాటకు విలువ యుండడము

౧౭౩ వితరణగా = ఎక్కువగా

౧౭౫ వేలాంతరాలు = వేలకొద్దీ; ఇల్లాగే లక్షాంతరాలు, కోట్యంతరాలు (౨౭౩)

౧౭౫ మంచివిడి (కుంకుమ పువ్వు)=మంచి స్వచ్ఛమైన లేక నిర్మలమైన కుంకుమ పువ్వు.

౨౦౬ హాజరుగా ఉన్నవి = ఇప్పుడున్నవి

౨౦౭ హాజరుభాషీగా = ప్రత్యక్షముగా నుండుట, హాజరై సిద్ధముగా నుండుట

౨౦౯ జులాయిస్తు = మైకముచేత మసలుట.

౨౧౯ సంకీర్లవాండ్లు = ఖైదీలు; రూపాంతరము : సంకిలవాళ్ళు

౨౨౭ భూమివాటము=భూమి అమరకపు పద్ధతి.

,, మామిలియతువాటము = మామిలీయతు అనగా సర్కారు వ్యవహార నిర్వహణము, (Management of public business ; affairs of Sta!e) అందువల్ల సర్కారు నిర్వహణంక్రింద భూములను అమరక పరుమపద్ధతి, సర్కారు బందోబస్తు, అని దీనికి అర్థము చెప్పవచ్చును)

౨౨౯ వారపత్తుభూమి=(అరవము) సర్కారుకు పన్ను చెల్లించేభూమి-(బ్రౌన్య-మిశ్ర.

,, బేరీజు = దివాణపు పన్ను మొత్తము; గ్రామమొత్తం మీదగాని జిల్లా మొత్తం మీదగాని సర్కారుకు చెల్లుశిస్తుమొత్తము; భూమికి నిర్ణయమైనశిస్తు.

౨౩౦ శేఖరం చేసేకొరకు; శేఖరం చేసివుంచి (౨౭౩)=సిద్ధము చేసేకొరకు; కూర్చుట కొరకు;

,, ములుకుగిరి (తిరుగుతూ వుంటాను) = పూర్వం మరాటీదండు అప్పుడప్పుడు వచ్చి పన్నులు వసూలుచేసే దౌర్జన్య పద్ధతికి ములుకుగిరి అనేవారు. దీనినిబట్టి సైనిక బలంతో శిస్తు దస్తులు వసూలు చేయడానికి అధికారులు అప్పుడప్పుడు సిబ్బందితో పర్యటనము చేసే పద్ధతికి ఈ పదం ఉపయోగించేవారు.

Mulkgiri:(Country seizing.) Process, of (Maratha) Land revenue collecting at the point of sword - Baden Powell vol. iii, p. 280.

Taking possession of a country, the periodical incursion of a military force for the collection of tribute or revenue (M. L. J. — Law Lexicon)

ఈ పదాన్ని వీరాస్వామయ్యగారు సందర్భానుసారంగా ఎంత గూఢార్థంతో ప్రయోగించారో చూడండి!

౨౩౦ తోలులుగా చీల పోతున్నది = తోనలవలె విడిపోతుంది; చీలిపోతుంది.

౨౩౧ ఎన్నులు తీయుచున్నవి = ఎన్నులు లేక వెన్నులు వోస్తున్నవి.

౨౪౪ మనిషి కట్టు = మనుష్యస్తోమము.

౨౫౧ రసగుండ్లు = పాదరసగుండ్లు లేక పాదరసము పూసిన గాజు బుడ్లు.

౨౬౬ సూత్రిపు పడవలు=మన్ను తవ్వి యెత్తిపోసే పడవలు; డ్రెడ్జరులనే అలాంటి పడవలకిప్పుడు అవిరియంత్రాలను అమర్చారు.

౨౬౭ వోలందావారు = హాలండువారు.

౨౬౯ శిడలు ఆడినట్లు=సిడులాడినట్లు. (సిడి, సిడులు) సిళ్ళు ఆడడమనగా గ్రామదేవతల కొలుపులలోను జాతరలలోను మొక్కుకున్న వారి వీపులలోనుంచి ఇనుపగాలములు దూర్చి సిడిమ్రానుకు అనగా సిడుల జాతరకు నాటిన స్తంభముమీది యడ్డు మ్రానుకుకట్టి త్రిప్పడము. దీనికి గాలపుసిడి అంటారు. ఇది చేయలేనివారిని గంపలో కూర్చోబెట్టి తిప్పే గంపసిడి ఒకటికూడా వున్నది. సిడి అనగా మొద్దులాంటి యీటె అని బ్రౌణ్య నిఘంటువు. నరసిడి గాక మేకపోతుసిడి కూడా వున్నది. దక్షిణదేశంలో ఇప్పటికీ ఇవి జరుగుతూవున్నవి. దీనికి ఇంగ్లీషులో (hook-swinging) అంటారు. 1824 సం॥ ఏప్రిలు 9 వ తేదీన కలకత్తాలో "చరక్ పూజ"అనేజాతరలో సిడులాడడం చూచి బిషప్ హెబరుగారు తమ జర్నల్ లో వర్ణించారు. (చూడు: బిషప్ హెబర్సుజర్నల్ 1 వ సం॥ పుట 98-100) "సిడిపేరైలెం దెలవయోర్తు" పాం. 3 ఆశ్వా. - శబ్దరత్నాకరం.

౨౫౪ కయామత్ కా దిన్ = హిందుస్థానీమాట. పుస్తకంలో కయామల్ కా దిన్ అని పొరబాటుగా అచ్చు పడింది దీని అర్థం ౨౫౪ పుటలోనే వున్నది.

౨౭౫ వుండరాములు (చేసినంతలో)=ఉండగూడదని నిషేధము చేయడం (ప్రాబంధిక భాషలోని 'పోరాములు' అనే ప్రయోగం ఇలాంటిదే)

౨౭౭ తట్టువాణి గుర్రములు = గుజ్జుపు తట్టువలు; (Tattoo-a Poney - బ్రౌణ్య-మిశ్ర)

౨౮౦ అరమనజాతి = అర్మీనియనులనే క్రైస్తవ జాతివారు

౨౮౫ బొందెగడ్డ = అరటిదుంప; దూట

౨౮౮ బోరుగద్దలు = బోరువగద్దలు; రాబందులు; (Vultures - బ్రౌణ్య)

౨౯౨ ఘూంకుమారీ = ఊదేవాడు

౩౨౪ వుగ్గలించి = (ఉగ్గలించి; ఉగ్గడించి) మొత్తిగు; శబ్దించు; వదించు; గట్టి కేకలు [వేయు

,, అకరము = అధారము

౨౯౬ మాతాశేశెద్ మక్కళ్ క్కు = తల్లి చేసినది పిల్లలు అనుభవిస్తారు అని అరవంలో అవ్వయారు అనే కవయిత్రి పలికిన సూక్తి.

౨౯౭ ఇడిసిన = చెడిపోయిన; ఇడియు అనగా పాడుబడు ఉ: ఇడిసినబావి(బ్రౌన్య)

సీ॥ ఇడిసిన యిసుపులఁ రొయెడలఁ బొఱ్ఱే
నుత్తరేను గసింద కోరింద పొదల — ఆము - ౬-౧౩

౩౦౪ నిశాని = చిహ్నము.

౩౦౪ తురకరాయి = బొంతరాయి (The Stone Called Laterite) బ్రౌన్య - మిశ్ర.

,, చిత్తులిపని = శిల్పము; చెక్కడపుబని (?)

౩౧౧ హస్తాంతరముగా = బదులుగా

౩౧౨ బోరగిలపోసుకోగానే సరేనా? = బోర్లగిల దోసుకోగానే సరేనా?

౩౧౫ ఉప్పుకయి వారగా = ఉప్పుకయ్య ప్రక్కగా.

౩౧౭ బాందలు = ఓడదొరువులు. వాడలు మరమ్మతు చేయుడానికి తీరమున గదులు గదులుగా త్రవ్విన దొరువులు (Docks)

౩౨౧ వెదురు దబ్బలు = వెదురుబద్దలు; వెదురుపేళ్ళు; సన్నగా చీల్చిన పేడు, బద్ద.

,, సఫా చేసుట = చేవాళ్ళు చేయుట, సైసుచేయుట.

౩౨౭ టీకాచేసేకొరకు = ఒప్పందము, ఖరారు, కంట్రాక్టు, ఏర్పాటుచేయుడానికి.

౩౩౦ నిండార్లుగా = నిండుగా; పూర్తిగా,

౩౫౦ జూములా = వెరసి

౩౫౧ తాజీం = (తాజీము) సమ్మానము, ఆతిథ్యము, గౌరవము, ప్రత్యుత్థానము;

శా॥ రాజా జారుఁడు మంత్రినిర్దయుఁడు నీ రాష్ట్రంబులోఁ బెద్దలా
కోజాల్ కొండలు జీవహింసకుసు సంకోచింప రెవ్వారికిం దాజీమీయరు.
—అడిదము సూరన్న చాటువు.

౩౫౨ తరాతరపరికారము = (తరాతరముగా) వారి వారి హెచ్చుతగ్గుల ననుసరించి వరుసక్రమంగా; తరాతరము తెలిసి మాట్లాడుట అనగా హెచ్చుతగ్గు తెలిసి మాట్లాడుట; (To appreciate, recognize, assign his due merit) ఒకని ఆధిక్యతను గమనించి గౌరవించుట

౩౫౩ వర్తకసంచు = వ్యాపారపు మెలుకువ; రీతి; వైఖరి, మోసము; తికమకలు

౩౫౪ తూకడానకు = నీళ్ళుతోడుటకు; ఎత్తు, లేవనెత్తు; (అరవము నుండి) (౧౪౦ తూకున తీయబడిన = ఉరిదీయబడిన) తూకుమాను = ఉరికంబము

౩౫౫ అనుత్తు కాదు = వీలుకాదు; కల్లకాదు

౩౬౧ కలాపన (పొసగి) = కలఁత, క్షోభము కలిగి

౩౬౩ సంకలితరోగాలు = అంటురోగాలు

# ఏనుగుల వీరాస్వామయ్యగారి

# కాశీయాత్ర చరిత్ర

# అకారాది విషయసూచిక

(౧) శీర్షికల ప్రక్కనున్న తెలుగు అంకెలు, కాశీయాత్ర చరిత్ర మూలగ్రంథం పుటల సంఖ్యలు. బ్రాకెట్లలో నున్న తెలుగు అంకెలు, శ్రీనివాస పిళ్లగారు వ్రాసిన వీరాస్వామయ్యగారి జీవితము పుటల సంఖ్యలు. ఇంగ్లీషు అంకెలు, ఈ గ్రంథం మొదటనున్న సంపాదకుని పీఠిక, వీరాస్వామయ్యగారు - వారి మిత్రులు, బ్రౌనుగారికి వీరాస్వామయ్యగారు వ్రాసిన లేఖ, మొదలైన విషయాల పుటలు.

(౨) చూడదలచిన విషయం ఎన్ని శీర్షికల క్రింద కనపడగలదో ఆలోచించి చూచి పరస్పర సంబంధం కల శీర్షికల పుటలన్నీ చూడవలెను.

(౩) ఒక్కొక విషయము ఆశీర్షిక ప్రక్క వేసిన అంకె గల పుటతో ప్రారంభమగును. ఆ విషయమింకను తరువాతి పుటలలో కూడా ఉండవచ్చును గనుక పుట తిప్పి చూడవలెను.

తాలూకా నాలుగు మేటీలుగా పంచి ఒక్కొక్క మేటీకి నొక్కొక్క అమలుదారుని నేర్పరచినాడు. కుంఫిణీకి సుమారు లక్షరూపాయలు సాలినా కట్టుచున్నాడు. అతని రాజ్యము భళ్లారిజిల్లా కలకటరాజ్ఞకు లోబడినది. ఆ నవాబు రాజ్యస్థులకు స్వంతముగా నొక ఖాజీకోరటు పెట్టి న్యాయవిచారణ చేయుచున్నాడు. గాని, జిల్లా కుంఫిణీ కోరటుకు నిమిత్తము లేదు. నవుకరులకు జీతము క్రమముగా ముట్టచెప్పడము లేదని వదంతి ౧౨

శ్రీశైలము గుడి హాశ్శీలు మూలకముగా సంవత్సరము ౧కి ౧౫౦౦౦ నవాబుకు వచ్చినా గుడి యే గతి పొందేదిన్ని విచారింపడు. ఎవరైనా మరమ్మతు చేసినట్టయితే సెలవంత హాశ్శీలు తీసుకొనుచున్నాడు. రాజా చందులాలా ఈ నిర్బంధము చేత కొంత మరమ్మతుచేసి విసికి విడిచి

కందనూరి నవాబు: పుట.

పెట్టినాడు............ స్వామికిన్ని దేవికిన్ని ఎవరయినా ఆభరణాలు వస్త్రాలు సమర్పించిరేని వాటిమదింపంత రూకల హాశ్శీలు పుచ్చుకొనడము మాత్రమే కాకుండా కొన్నిదినములు పోనిచ్చి ఆ కందనూరి నవాబు అపహరింపుచున్నాడు. ౨౦

## సవరణలు

| పుట | కాలం | పంక్తి | శీర్షిక | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 42 | 2 | 34 | ఏకమేవాద్వితీయం బ్రహ్మ | ౨౩ | ౨౩౩ |
| ,, | ,, | 35 | ఏకవారాశనం | ౫౬౩ | ౫౬ |
| 48 | 2 | 26 | దేవరేణ సుతోత్పత్తి | ౧౬౧ | ౧౬౪ |
| 60 | 1 | 19 | నాణ్యములు | ౩౧,౩ | ౩౧,౩౪ |
| 60 | 2 | 7 | నీలిమందు | ౩౩౭ | ౨౪౦ |
| 64 | 2 | 22 | బలులు | ౩౭౧ | ౨౭౧ |
| 70 | 1 | 19 | లకునో నవాబు | ౧ | ౧౬౧ |
| 48 | 2 | 22 | కృష్ణానదికి గోదావరీనదికి మధ్యదేశము. చూడు : హైదరాబాదు నాగపూరుల మధ్యదేశము. | | |
| 49 | 1 | 24 | క్రీస్తు (అవతారము) | — | ౭౩ |